# అంకితము.

జనకుఁడు వేమయాఖ్యుఁడు ప్ర -
శస్త గుణంబులఁ బూనినన్ను వా
వనునిఁగఁ జేయ బాధలను - వందలు వేలు
సహించి, విద్యలన్
ఘనునిగ సల్పి, ప్రోది నను - గాంచఁగఁ జూచి,
ప్రశాంత బుద్ధితోఁ
దనువునువీడి స్వర్గమునఁ - దావలమేర్పడ
నేగె ధన్యుఁడై

ఆ మహిత యశోనిధికి, మ - హాశయునికి,
రామభక్త శేఖరునికి, - ప్రవిమలమగు
పద్యకావ్య మంకితముగ - పాదయుగళి
నిడుచునున్నాఁడ భక్తితోఁ - మడుగులొత్తి.

# నివేదనము.

—oOo—

అనుతాపము, ముష్టివాడు అను రెండు ఖండకావ్యము లను ఒక పుస్తకముగా ప్రచురించితిని. మొదటిది పశ్చాత్తాపమును, రెండవది దుఃఖమును సూచించునవియై యున్నవి. అనుతాపమను పదమునకు ఈ రెండర్థములు స్ఫురించుటంబట్టి ఈ గ్రంథమునకు ఈ నామకరణము జరిగినది.

అనుతాపము ఒక ఆంగ్ల పద్యభాగమునకు స్వేచ్ఛానువాదము. The Sick King of Bokhara అను ఆంగ్ల పద్యభాగము నా పదునేడవయేట నాల్గవఫారము చదువునపుడు పాఠ్యభాగముగా నుండినది. అందలి కథ నాహృదయమును చూఱగొని అనువాదమునకు పురికొల్పినది. ఆనాడే రచించిన ఈ ఖండకావ్యము ధనాభావమున వెలువడనేరక పేటికాంతర్గతమై యుండినది.

ముష్టివాడను ఖండకావ్యము 14=6='46 న జరిగిన ఒక విషాద సంఘటనమున రేకెత్తిన హృదయ తాపాంకురము. ఆనాడు తిరుపతి కొలనుగట్టున ఒక భిక్షకుడు మృతినొంది, ఉదయమునుండి సాయంత్రమువరకు స్మశానవాటికకు జేర్చువారు లేక పడియుండం జూచుట తటస్థించినది. మునిసిపాలిటి వారికి వ్రాసి, శవజాగరణమునకు ఏర్పాటు గావించితిని. ముష్టివాడే తన లేకితనమునకు చింతిలుచు, విఫలమనోరథమున భగవంతుని

దేశకు మరలుటయే ఇందలి కథాభాగము. ఇద్దానిని శ్రీకృష్ణ దేవరాయ గ్రంథమాల, అనంతపురము వారు "రాయలసీమ రత్నరాశి" అను పుస్తకమున ఒకభాగముగా సచ్ఛాపింతిరి. దానినే మరల ఇందుఁ జేర్చితిని.

ఈ ఖండకావ్యములు చదువరుల నాకించుకేనియు భాషయందభిరుచి కల్గించినచో నాయీప్రయత్నము సఫలీకృతమైనదని సంతసింతును.

ఇట్లు,
గ్రంథకర్త.

---

# అభిప్రాయములు.

కవికోకిల, కవితావిశారద, ఉభయభాషా ప్రవీణ, కవిదిగ్గజ, నవయుగ కవిచక్రవర్తి, శ్రీ జి. జాషువా గారు.

ఆర్యా — నమస్తే.

తామంపిన "అనుతాపము" అను కావ్యం, వ్రాసిన యుత్తరం, చేరినవి. మీ గ్రంథం సాంతంగా చదివాను. ఎలబ్రాయంలో వ్రాసిన మీ కావ్యంలో ప్రాచీనకవుల పోకడలు గోచరిస్తున్నవి. నేటి మీచేతి కలం ఎన్ని చమత్కృతులు నేర్చి, ఎంతరసాన్ని చిమ్ముతుందో అని సంతోషపడ్డాను. మీ కవితా దృక్పథం — సువిశాలమై, విశ్వకల్యాణమునకు త్రోవలు నిర్మించ గలదని ఆశిస్తున్నాను. మీకు శుభమగుగాక.

గోపాలకృష్ణ స్వతోట, }
గుంటూరు, 25-2-54, }

భవదీయుడు,
జి. జాషువా.

## గౌ॥ మంత్రి శ్రీ డి. సంజీవయ్య గారు, B.A., B.L.,

చిఱుత ప్రాయము నాఁడేమి — యెఱుఁగవపుడె
ముద్దులొలికెడి రమ్యమౌ — పద్దెములను
వ్రాసి పలువుర మన్నన — బడసెనయ్య
అవని వేంకటసుబ్బయ్య — కవివరుండు. 1

అంటరానితనంబును — మాటుఁగఁ జూప
పెక్కువిధముల కృషిసల్పె — నిక్కముగను,
సంఘసంస్కరణార్థమై — జాను తెనుఁగు
పద్దెములఁ బెక్కు వ్రాయఁగా — వలయునింక. 2

పండితులకు పామరులకున్ — భావమలర
సర్వవిధముల నొప్పెడు — సరసమైన
భావములకుప్ప కనుఁగొప్ప — భవ్యకవిత
లల్లి సత్కీర్తి సతతము — నందుగాత. 3

కవులు పండిత గాయకుల్ — కలరటంచు
హరిజనావళి యెప్పుడు — హర్ష జలధి
నోలలాడంగఁ జేసెయా — లీల నిరతి
వాఁడు వేంకటసుబ్బయ్య — మాన్యుఁడవని. 4

ఆయురారోగ్య భాగ్యంబు — లబ్బఁజేసి
కవిత వ్రాయఁగ వలసిన — కలము బలము
దేవదేవుఁడీ కవికిచ్చి — కాచునటుల
మదిని ఆశీర్వదింతు నీ — మాన్యసుతుడు. 5

ఇట్లు, భవదీయ శ్రేయోభిలాషి,
డి. సంజీవయ్య.

'నవజీవన' పత్రికా సంపాదకులు
శ్రీ బి. యస్. మూర్తి, B.A., B.ED., M. U. P.,

—o—

వాల్తేరు, 26-5-54.

మీ "అనుతాపము" ను మంత్రి శ్రీ సంజీవయ్యాగారి సమక్షంలో చదువుట సంభవించింది. కథావస్తువు, చిత్రనైపుణ్యం, భావప్రకటన, రచనా పాటవము హృదయానందదాయకంగా వుండి, పఠితలను, శ్రోతలను తన్మయం చేయుచున్నది. మీరు యింకా యితోధికంగా భాషాసేవచేస్తూ అనేకగ్రంథ ములను వ్రాయగలరని ఆశిస్తున్నాను.

బి. యస్. మూర్తి.

—ooo—

# కవి జీవితము :

శ్రీ. డి. వి. రామచంద్రరావు గారు, జమ్మలమడుగు.

1918-11-12 తారీఖున, అనగా 11 వ తేది రాత్రి నాలుగు గంట లకు కడపజిల్లా కోడూరు గ్రామమున శ్రీ పి. వేంకటసుబ్బయ్యగారు జన్మిం చిరి. వీరు 1951 వ సంవత్సరము డిశంబరు నెలలో మద్రాసు శాసనసభ్యుల ఎన్నికలలో పోటీచేసి గెలుపొందిరి.

ఈ జాతకము సాయనపద్ధతి పాశ్చాత్య దృగ్గణిత పంచాంగము నను సరించి వ్రాయుడమైనది.

| | | | |
|---|---|---|---|
| రా 21 | చ 21 | | శ $16\frac{1}{2}$ |
| యురేనస్ 4 | సాయనము<br>12-11-1913<br>తులాలగ్నం | | ప్లూటో 1<br>X 16<br>కు 23 నె 28 |
| గు 15 | | | |
| బు 9 | ర 19 | శు 27<br>లగ్నం 17 | కే 21 |

లగ్నము తులారాశి ద్వితీయ ద్రేక్కాణ మయి, లగ్నాధిపతి శుక్రుడు స్వక్షేత్రమున లగ్నమున యుండుటచేత జాతకునకు సాత్వికస్వభావము, ఉదారత్వము, తారతమ్య పరిశీలనాశక్తి, శాంతము, క్రియాశక్తి, సంగీతమందభిరుచి, న్యాయప్రవర్తన, తగవులను సులభముగా పరిష్కరించు నేర్పరితనము నుండును. జలరాసులలో ఎక్కువ గ్రహములుండి చరరాసులలో ఎక్కువ గ్రహములుండుటచే జాతకునకు దయాహృదయముండును. ఇతరులకు మార్గదర్శకుడగును. బుధయురేనస్‌లకు శుభదృష్టి కలుగుటచేత మేధాశక్తి జ్ఞానము కలుగును.

లగ్నము తులరాసియందు 17 డిగ్రీలగుటచేతను, జలరాసులలో గ్రహములెక్కువ యుండి, ఊహాకారకుడగు నెప్ట్యూన్ గ్రహము కుజసంయోగముతో దశమస్థానమున నుండుటచేత వీరలకు శుక్రచంద్రుల కేంద్రదృష్టి కలుగుటచేత, లిఖితస్థానాధిపతి గురువు కేంద్రస్థితుడై రాజగ్రహమగు రవి శుభదృష్టి పొంది కారకుడు బుధుడు లిఖితస్థానమున నుండుటచేతను, ఇష్టస్పష్ట కారకుడగు శని యోగకారకుడై భాగ్యమగు మిథునరాశియందు వుండుటచేత జాతకునకు కవిత్వము లభించినది. రాజఠీవిగల సులభశైలితో పద్యకావ్యము వ్రాయును.

తదితర కారణములచేత జాతకునకు కీర్తి, స్వయార్జిత లభిత, ప్రభుత్వ మూలమున సంపద అధికారమును ఉండును. విషయవిస్తార భీతిచే యెక్కువ వ్రాయజాలము.

—డి. వి. రామచంద్ర రావు.

## శ్రీ రామచంద్ర సోమయాజులు గారు, అనంతపురం.

క॥ స్వభుజోపార్జిత ధనుడును, బహుతుల్యుడు
స్వజనవిభుండు ప్రఖ్యాతుండున్, శుభగుడు
నభయుండును, రవినిభ తేజుండగును
నీతుండు నివసింపఁ దులన్."

......దైవజ్ఞ యశోవిభూషణము.

కృతికర్త వంశావళియో, కవి ఫోటోయో యీయఁడవలసిన ప్రస్తావనయందు జాతక మిదేల యని చదువరులకు సందేహము గల్గుట సహజము. నిన్న మొన్న సరస్వతీ గ్రంథమండలి వారి "ఆంధ్ర రచయితలు" చదివితిమి. శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మగారి "ఆంధ్ర కవయిత్రులు", "నవ్యాంధ్ర సాహిత్యవీధులు" 4 భాగముల నవలోకించితిమి. "కవిజీవితముల"ను చిన్నతనముననే చదివియుంటిమి. శ్రీ తిరుపతి వేంకటేశ్వర కవుల "జాతకచర్య" యందును, శ్రీ జయపురం మహారాజావారి సీసమునకుఁగాక, కవుల జనన వివరములు వేరెచ్చోటను గానరావు. కీర్తిశేషులైన కవుల కాలనిర్ణయములపట్ల వాదోపవాదములను పత్రికలయందు నిత్యమూ చదువుచునే యుంటిమి. Wheel of Life or Scientific Astrology అను 5 volumes గ్రంథమును Maurice Wemyss అను గ్రంథకర్త రచించియుండెను. వృత్తినిర్ణయమునకే ఈ గ్రంథము ప్రత్యేకముగా నుపయోగించును. Volume III pages 5- to 62 Lyric, Epic and Dramatic కావ్యములను రచింపతోడ్పడిన గ్రహసన్నివేశములనుచర్చించి, ఆంగ్లగ్రంథకర్తలందరి జాతక వివరములను భాగలతోసహా నిదర్శనపూర్వకముగా వ్రాసియుండెను. పాశ్చాత్యదృష్ట్యా కాకున్న శాస్త్రరీత్యానైన ఆంధ్రరచయితల జననవివరముల సేకరింపనుద్యమించి, ఈ క్రింద నుదాహరించి, చదువరులకు మాసందేశము నందజేయుచున్నాము.

మనకవి జాతకచక్రమున రవి (సాయన) వృశ్చికం 18 డిగ్రీలు 53′ భాగయందుండెను. Sir C. P. Ramaswami Iyer, Sri

L.R.V. Krishna Rao Bahadur, B.A., Zamindar of Polavaram, Maker of Modern China, వీరు మువ్వురును రవి వారిజాతకముల ఇదే భాగయందుండగ జనించినవారే. వీరు ప్రఖ్యాత రచయితలేగాక, రాజ్యాంగపద్ధతి నిర్మాణ ప్రవీణులు. రవి ఉత్తమమానమగు నున్నతిని మనకవికి ప్రసాదించుగాక.

మనకవి తులాలగ్న జాతకుడు. జాతకస్వామి శుక్రుడు స్వక్షేత్రమగు తులయందు బలీయుడై బాల్యముననే కవిత్వధారను ప్రసాదించినాడు. శుక్రుడు కళానిధి. ఈశుక్రునికి చంద్రునితో సమసప్తకము. సేవాపరాయణత, స్వార్థరాహిత్యము, కష్టచయములు చుట్టుకొనగా నెదుర్కొను పవిత్రశీలత నలవరచును శుక్రచంద్ర వేధ. విశ్వమానవసౌభ్రాత్రమున కిది సోపానము. కవిజీవితం కరుణామయము.

భావనాశక్తి ప్రదాత ఇంద్రుడు (Neptune) దశమమున యున్నతుడై (elevation) లగ్నదశమాధిపతులై, లగ్నసప్తమములనున్న శుక్రచంద్రులను రాగోజ్జ్వల ప్రబోధితులజేసి, రసామృతప్రవాహ మూర్ఛల కేత మెత్తినాడు. తులాలగ్నం 17 డిగ్రీభాగ భావకవిత్వమునకు కళాపీఠము. ఆ ప్రవాహముల మొలకలెత్తి పండినపంటయే ప్రస్తుత కావ్యము.

రాజ్యాధిపతియగు చంద్రునికి సప్తమస్థితి సహకారమును సూచించును. ద్వితీయమందలి రవియు ద్వితీయస్థానాధిపతియగు కుజునికి దశమమున నున్నతియు, రాష్ట్రశాసనసభా ప్రవేశమును, పరిపాలనా విధానమునందొక ప్రముఖ ప్రాధాన్యతాయుత పదవీస్వీకరణమును ప్రసాదించును. తృతీయమందలి బుధుడు ముందు పేర్కొనబడిన సదవకాశములన్నిటికినీ కార్యరూపమునివ్వగల శేముషీవిశేష మలవరచి, మనకవి జీవితమును వికసింపజేయును.

గీ॥ త్రాక్షికమున నింద్రతనయుడు వసియింప
రాజ విబుధాగ్ర్య పూజితుండు, నింగితజ్ఞు
డును, సమిద్ధ వివేకియు నగును ధరణి పు
రుషవరేంద్రుడు బుధుడు. ...దైవజ్ఞ యశోవిభూషణము.

ఇట్లు,— రామచంద్ర సోమయాజులు.

# అనుతాపము

## ఒకటవ మజిలీ.

ఉత్తర కాబూల్ నాడున
కర్త్రి నొకపట్టణము బొ — ఖారాయనఁగన్
పెత్తనదారుల పట్టై
యుత్తమ భోగముతోడ — నొప్పుచునుండెన్. 1

దానిఁ బరిపాలనము సేయు - ధవుఁ డొకండు
ధర్మపాలనోత్సుకుఁడౌచు - దైవభీతి
నెపరి కేయపకృతి కల్గ - నీయకుండ
పాలనముసేయు ధర్మ భూ - పాలుఁడనఁగ. 2

ఇటులఁ గాలమ్ము గడువఁగా — చటుల భీష
ణముగఁ గఱవొండు వ్యాపించె — నరుల గుండె
లవియఁగ ధరాధిపుఁడు కడు — వ్యాకులభర
చిత్తుఁడై బెగడొంది కృ — శింప నపుడు. 3

అంత మంత్రి సామంతుల - చెంతఁ జేరి
మంతనంబులఁ గావించి - చింతఁ దొఱఁగ
భక్తి భగవంతు భజియింపఁ - బాయుఁ గలవు
లనుచు నాజ్ఞను గావించె - మనుజవిభుఁడు. 4

కమలబాంధవుఁ డేగఁ జీ - కటులుఁ గ్రమ్మె
క్రమ్మినంతనె చుక్కలు - గడలుకొనియె,
కప్పు తెరపైన మల్లెము - గ్గల విధమ్మ
నూహసేయఁగ వచ్చునా - యుప్పరమును. 5

తూరుపుదిక్కు చేడియయుఁ-
దుంగధరాధర వన్యభూములన్
జేరి ముఖాంబుజంబు విక-
సింపఁగ వాయువిహార సంపదన్
గోరిక ముగ్గునెట్టుటకుఁ-
గుంకుమ ముంపుల నచ్చటచ్చటన్
దీరిచె వేడ్కఁ ద్రోవలన-
దిక్కులఁదోచెను భానుహస్తముల్. 6

మత్తు దిగఁద్రావి సర్వ జ – గత్తు దెలివిఁ
బొందె ప్రత్యూషకాలమ్ము – వాడముట, భువి
పట్టణమ్ముల మించు న – ప్పట్టణమ్ము
చలనభావమ్ముఁ దాలిచె – సత్వరముగ. 7

నిద్దుర మేలుకాంచి ధర
ణీధవుఁ డచ్చపు నీటఁదోఁగివే
ముద్దియ లిచ్చు వస్త్రముల
మోదము మీఱఁగఁ దాల్చి భోజనం
బెద్దియుఁ బుచ్చుకోక మది
నీశ్వరు నెంచుచు భక్తి నెక్కొనన్
పెద్దలు వెంటనంటి నడ
వెల్వడె కాల్నడ రాజవీథులన్. 8

ముందు వెనుక మంత్రిపుంగవు లరుదేర
నంగభటులు దెసల – ననుసరింప
చంద్ర తారలగతి – చాద్పున గనుపడె
జనము లచ్చటచట – వినుతి సేయ. 9

దివిజకాంతలు మొయిళ్ళుల — తెరలనుండి
కుసుమవర్షంబుఁ గురిసిన — కొమరుమిగుల
నగర హర్మ్యంబులనునుండి — మగువలపుడు
పుష్పవితతులఁ జల్లిరి — పుష్కలముగ. 10

నగరు మొగసాల గరితలు — నడువనోడి
ఱాలబొమ్మలోయన నిల్చి, — ప్రముదమాన
సంబున వితాకుఁ జెంది, వి — శాలనేత్రి
పాటవముతోడఁ గాంచిరి — పార్థివేంద్రు. 11

రాజ్యలక్ష్మిని భరియించి — రంభకుద్ది
యగు లతాంగినిఁ జేపట్టి — మిగులయశము
నొంది భోగభాగ్యమ్ముల — నోలలాడు
పుణ్యపురుషుఁ డీతండని — పొగడి రపుడు. 12

అట్టిచో నొక విన్నప — మవనినాథు
నకు నివేదింప నొక్కండు — నయము భయము
బాసి చిఁపిరి పాతల — భంగపడిన
రూపమునుగల్గి ధర్మంబు — ప్రాపుగోరి. 13

బెళుకు కన్నుల నెడనెడ - బిందువులుగ
రాలుకన్నీటఁదడిసిన - చేలములను
గల్గి గాద్గదిక మెసఁగ - కరములెత్తి
ఆగుమోరాజ యనెనిట్టు - లమిత ధృతిని. 14

"నేర మొనరించినాఁడను - నీతిదొఱఁగి
ధరణి మాతాపితర్గురో - దైవమనుట
హృదయమందునఁ దలువక - నెడ్డెనగుచు
శిక్షవిధియించు మోరాజ - శిష్టబుద్ధి." 15

అనుటయు రాజానుచరులు
మనవిని నాశ్చర్యచకిత - మానసులగుచున్
మనుజాధీశుని మొఱుకకుఁ
గొనిపోయిరి చూచువారు - కొనియాడంగన్. 16

చింపిపాతఁ గట్టి - చిందరవందరఁ
జెందియున్నవాని - సిగనుగాంచి
పిచ్చివాఁడని వీఁడు - పెచ్చుకోపమునొంది
వానిఁ బొడిచి తరుమ - నానతిచ్చె. 17

భటులు తక్షణంబె – పట్టుకొరులఁ గ్రుచ్చి
దారిఁ దోలఁగఁ ద్రోచి – దైవకార్య
తత్పరులయి చనిరి, - తరలిపోయెను నాఁడు
దైవపూజకేమి – తక్కువడక. 18

ఆశ విఫలముగాగ శో - కాగ్నికీల
హృదయకోశంబు నెఱి దహి – యింపఁజొచ్చె,
లోకమంతయు నతని వి - లోకనమునఁ
గటిక చీకఁటి నిండిన - కరణిఁ దోఁచె. 19

తప్పుఁ జేసిన వారెల్లఁ - దమకుఁ దామె
శిక్షఁ గోరినఁ బుడమియే - శివముఁ గూర్చు
స్వర్గతుల్యమ్ముగా మారు - సజ్జనులకు
నాటపట్టగు దైవ మ - ప్పాటఁ జేరు. 20

మఱునాఁడా మానవపతి
పరమేశ్వరుఁ బూజసేయు – భావముతోడన్
పరివేష్టిత పురజనుఁడయి
పరమానందంబెడందఁ – బర్వగ సనఁగన్. 21

పూర్వము పరాభవంబును - బొంది మిగుల
గాసిఁ జెందిన యువకుండు - కార్యదీక్షఁ
నవనినాథుని మార్గమ్ము - కడ్డువడఁగఁ
దలఁచి యరుదెంచె పనివడి - ధైర్యవృత్తి. 22

ఒకఁడు భగవంతుపై దీక్ష - నొప్పియుండె,
నొకఁడు తనకార్యదీక్షపై - నొరిగియుండె,
ఎవరి కార్యమ్ము సాఫల్య - మెనయఁ గలదొ
సర్వమునుఁ జూడవలయుఁ బ్ర - శాంతమతిని. 23

తాలగనులందు రత్నముల్ - గ్రాలుభంగి,
చింపిపాతలఁ జుట్టియు - జీవకళలు
కాననగు ధర్మనిరతుని - యాననమున;
కార్యదీక్షయే నగును త - త్కారణమ్ము. 24

అటువలె నతఁడట ననిసని
పటుబుద్ధిని జయముఁగూర్పఁ - బాపము నెడపఁగా.
చటుల భయావహమగు సం
కట మొదవంగను వచించె - కనలఁగజనముల్. 25

"ధర్మంబు నేరిచు - ధర్మంబునకు శిక్ష
ధీజనస్తుతముగాఁ - దెలుపుచోట,
అన్యరాజులుపోరు - కాయత్తపడఁ గని
మున్ముందుగాఁవైరిఁ - బోరుచోట,
తనవారిలోఁ బ్రభు - స్థానంబునకుఁ గుట్రఁ
జేయువారల నురి - దీయుచోట,
పరిపాలనమునందుఁ బరిపాటియెఱుఁగమి
మంత్రియాలోచన - మ్మందుఁజోట,

శుభముహూర్తమున కెదురు - చూడనగునె
నీతిఁజెప్ప నేనెంత మీ - నిత్యకార్య
కలనమగుగదా! భూనాథ! - కనికరమున
ధర్మమూర్తులఁ బిలిపించి - తఱచవలదొ." 26

అనుటయు మనమున గినుకయు
ననుమానము మఱియుఁ బెద్ద - యబ్బురపాటుఁ—
మునుకొన నిశ్చేష్టిత వాఁ
డనుమాట లొకింతవినుట - కభిముఖుఁడయ్యెన్. 27

అదికని యాతఁడు ముదమున
నెదలోఁగల సంకటంబు – నెల్లరు వినఁగాఁ
జెదరిన చిత్తంబాకచోఁ
గుదుటవడఁగ మాటలాడెఁ - గోర్కెలెనంగన్. 28

"మండు వేసవి కాలమై – యుండుటయును,
త్రావ జలము లభింపక - పోవుటయును,
తమకుఁ దెలిసిన విషయమే - ధరణినాథ!
వినుఁడు తత్కారణమునఁ బ్రా - ప్తించె నిట్లు. 29

తృష్ణ పైకొన నీటికై – యేగియేగి,
ఒక్కయెడఁ బంకిలమ్మగు – నుదకమింత
యర్థిఁ గూర్చుచు దాచితి – నటుకపైన
పరుల కీయంగరాదుగ! – వారినింక. 30

త్రాగునీటికై ని – దాఘంపుటెండలఁ
దిరిగి తిరిగి యలసి – తిండిలేక
మాడి జ్వరముఁ దవిలి - మందుండనైయుంటి
నాటి రాత్రివేళ – మాటలుడిగి. 31

అర్ధరాత్రమందు — నారాటమును గొంత
దీర్చుకొనఁగఁ దలఁచి - దిటవుఁ బఱచి
యున్న నీటికొఱకు — తిన్నగా నేగితి,
నేమిఫలమునీ రొ — కింత లేదు. 32

అంత కోపమునొంది మా - యమ్మఁ జూచి
మంచి చెడుగుల నెంచక — మందమతిని
పాపకూపాన ద్రెళ్ళెడు — ప్రాప్తమేమొ
దూషణము జేసితిట్టుల — ధూర్తునగుచు. 33

ఏమేమీ! కులటా! జలమ్ము నొకచో
నేనుంచి పోవంగ, నీ
నేమంబుం దిలకించి సర్వమును గాఁ
జేయంగ నెట్లోర్చితే
కామాంధంబునఁ గన్నుగానని నిను
ఖడ్గమ్మునం గోసినన్
నేమంజేయగుఁ గాని కీడుగలదే!
ఛీ" యంచు నప్పట్టునన్. 34

ఆలకించినార! - పాలసుండ నయితేఁ
దల్లి దూఱినట్టి - తప్పుకతన,
తగినశిక్ష వెట్టి — దయఁగావుమోరాజ
ధర్మపాలనంబుఁ - దప్పకుండ. 35

అనవుడు ధరణీశుఁ — డబ్బురపాటున
పిచ్చివాఁడని మది — నొచ్చుకొనుచు,
బాటఁ దొలఁగిపోవఁ - బరుషంపుటానను
జేసె నతఁడు మిగుల - చింతనొంద. 36

అవమతి ప్రాపించెఁ గదా!
అవనీధవుఁ గరుణలేమి — యరిగెద ననుచున్
దివియంగ రాని వగపున
భువిపైఁ దూలుచు వనరుచుఁ - బోతోఁ గడఁకేఁ. 37

అతని దుఃఖమ్ముఁ గాంచుట — కనుమతింప
కినుఁ డపరసాగరమ్మున - మునిగిపోయె
రజనిదాల్చెను నీలవ - స్త్రమ్ము నపుడు
దుఃఖమెంతయు హృదయాన - తొట్టుచుండ. 38

ఇంటికి నేగుటెట్లు? జన - యిత్రినిఁ గన్నులఁ గాంచుటెట్లునే
దొంటివిధాన నుండుటెట్లు - దుస్సహమైన ప్రయాసమేఽవిధిన్
గెంటుట దైవమా! యనుచుఁ - గీడ్పడి నేలను గూలుఽప్రానుగన్
కంట జలమ్ముఁ గార నొక - గట్టునఁ గూలె విచారగ్రస్తుఁడై. 39

హృదయవేదన పొంగి ద - హింపఁ దనువు
నతఁడు కర్తవ్యతామూఢుఁ - డై యొక యెడ
కంటిపై రెప్పవేయక - యొంటిపాటు
నేడ్చి యేడిచి నిద్దుర - నెటులొ కనియె. 40

ఉదయమునలేచి కన్నుల - నుద్గమించు
బాష్పములఁ దుడిచికొనుచు - పార్థివేంద్రుఁ
జూడసమకట్టి నెడలెను - చూచువారు
చిత్రపడుచుండ నతని ప్ర - సిద్ధమతికి. 41

అతఁడు జనుచున్న వీధినే - యవనిధవుఁడు
మంత్రి సామంత పరిజనుల్ - మడువులొత్త
నిర్మలాంతఃకరణమునఁ - గర్మసాక్షి
కెఱఁగ నేగుచుండెను భక్తి - యేపుమీఱ. 42

ఎదురుపడిన యతనిఁ జూపి - యెడ్డెమనుజుఁ
డని జనంబులుఁ బిలువఁగా, - "నతఁడతండె
పిచ్చివాఁడని" కొందఱు — పిలుచుచుండ,
దారినీయకుఁడని పెద్ద - వారుపలుక. 43

"ఆగుమోరాజ నాపని — య్యైనఁగాని
పోవఁగాఁ జన" దని చెప్పి — బుద్ధి నిలిపి
జంకు గొంకు లేక మిత స్వ — చ్ఛందవృత్తి
మాటలాడె జనమ్ములు — మ్రానుపడఁగ. 44

భక్తి బరమార్థముగ నెంచి — భజనసేయఁ
బోవువారలు నీతినిఁ - బోవరేని
మోరఁబై కెత్తి చనెదు నా - బోతు గోయి
లోఁ బడెదురీతిఁ జెడుదురు - లోకమందు. 45

తప్పుఖండించి యొప్పను - దాల్మిఁబ్రోచి
ధర్మపరిపాలనము సేయు — ధాత్రిధవుఁడు
పెడచెవినిఁ బెట్టి న్యాయమ్ము — కడకుఁ ద్రోయ
కంచెయే చేనుమేసిన — కరణిఁగాదె. 46

నేరమునకు శిక్ష - నేరుపరుపకున్న
నరకమునకు గూఁజియు - నరుఁడుఁ జూడ
వేగ శిక్షవెట్టు - వేదసరణి రాజ
యిహాపరమ్ములఁ సుఖ - మిచ్చుదాత. 47

మెడఁబడిన పాము కలవక - విడువదచుచు
మానసమ్మునఁ దలపోసి - మానవపతి
శాస్త్రపరిశోధనముఁ జేసి - సత్వరముగ
శిక్షవెట్టుడటంచును - జేసెనాజ్ఞ. 48

న్యాయమూర్తులు రాజాజ్ఞ - ననుసరించి
శాస్త్రములఁ ద్రిప్పి దండన - జాటిరపుడు
శిలలచేఁగొట్టి యసువుల - వెడలఁగొట్టఁ
తల్లిదూరిన వారికి - తగునటంచు. 49

అట్టి బెట్టిదమ్మగు శిక్ష - కవనిధవుఁడు
దుఃఖభూయిష్టచిత్తుఁడై - తోడనుండు
ముఖ్యమంత్రులతోఁ గొంత - ముచ్చటించి
ముదలనిచ్చెను చాటింపఁ - బ్రోలునందు. 50

'ధర్మముఁజూచుచో మరణ–దండన యుక్తము, ప్రేమఁజూచుచో
ధర్మముగాదు జంపుటయు, - ధార్మికశిశువు వీడిమీరలా
నిర్మలమూర్తి జీవములు - నిల్పుడి, యాతఁడు పశ్చాత్తాపమున్
కర్మను మానివేయుడి, సు -ఖమ్మునుగూర్చుడి మందుప్రాకులక్'

అనుటయు సచివులావేళ — నన్నిచోట్లఁ
జాటఁ బంచిరి పుడమిరాశు _ మాట తెరువు;
యుక్తకార్యమ్ములన్నియు — నొనరఁజేసి
సిద్ధపడినార లాతని — శిలలఁ జంప, 52

ఆ వినోదముఁ జూడఁగ — నన్నిచోట్ల
నుండి కదలిరి జనములు — మెండుగాను
వారివారికిఁ దోచిన — భావములను
నొండొరులతోడ ముచ్చట — లాడికొనుచు. 53

పతిపల్కులను విని — జననీజనకుల ని
దుమల పాల్సేయు చె - డుగులు లేర?
ప్రభుశాసనమ్ముల — పలుమారు లెదిరించి
తప్పితిరుగువారు _ ధరణి లేర?

గురువిత్తమును దోఁచి - కోవిదులవిధము
వర్తించువారలు — వసుధ లేర?
ఇదమిద్ధమని గ్రహి — యింపఁగా నేరక
తలిదండ్రులనుఁ గొట్టు — ఖలులు లేర?

అకట! యిదియేమి చిత్రమొ — ప్రకటితమ్ముఁ
జేసినారొక్క మనుజుని — చిత్రగతుల
ప్రాణములఁదీయఁ దల్లిని - ప్రతిఘటించి
నాడను నెపమున ననుచు - నచటఁ జేరి. 54

తలలు వంకించి ముఖములు — నలుదెసలకుఁ
ద్రిప్పి దుఃఖవాలకముల — నప్పురజను
అప్పుడు కనుపింపఁగఁజేయ - నవనినాథుఁ
డచటి కరుదేరె ననుచరు — లనుసరింప. 55

వచ్చి నిలుచుండి శిక్షకు — పాత్రుఁడైన
పావనునిఁ దెచ్చినిలిపిరి - బయలనంత
విశ్వమెల్లెడ మబ్బులు — వెల్లివిరిసి
బాష్పములు రాల్చెననఁగఁ - జూపట్టె నపుడు. 56

శారదాభ్రవితతి - శకలభావము వీడి
కాఱుమబ్బులనఁగఁ - గ్రమ్మికొనెను,
నిర్ఘాతజనిత ప్ర - తిర్ఘాతములతోడఁ
జెలఁగెఁ దటిల్లత - చిత్రగతుల,
వాయువత్యుద్ధతి - ప్రళయకాలమునాఁగ
భూరుహమ్ములనెల్ల - భూమిఁ ద్రోచె
విశ్వమంతయు ధూమ - విసరావృతంబయి
భయదావహమ్మగఁ - బ్రబలెనంత,

సర్వమయుఁడైన విధికి య - సమ్మతమన
సృష్టియంతయు వింతగాఁ - జెలఁగెనపుడు
నిత్యసత్యవ్రతుండగు - నిర్మలాత్ముఁ
జంపగా సమకట్టు నా - సమయమందు. 57

రాజపుంగవుఁడటఁ జేరి - రాతినొకటి
కరమునందున వహియించి - క్రమమువిడక
ప్రార్థనముఁ జేసి యతనిపై - 'ప్రాప్త'మనుచు
వేయ ననుకరించెను ప్రజ - వెలితివడక. 58

కదలక మెదలక — కన్నీరుఁ గార్చక
నిలుచుండె రాళ్లపై — నించుచుండ,
ఫాలభాగము గాయ - పడి రక్తమాంసముల్
జగతిఁ బడ ప్రతిమ — పగిదినుండె,
కరచరణమ్ములు — విరిగిపోవుచునుండ
తానింతజడియక — తాల్మిఁదాల్చె,
పుడమిఁ శూద్రాధీర - పురుషుని గొనియాడి
కనులు మూసికొనియెఁ - గాంచవెఱచి,

రాజభటులు తమకు — రాజశాసనమును
మీఱవెఱచి కనుల — నీరుఁగార
వేసిరపుడు శిలల - వేవేలనుద్ధతి
అచటి జనులగుండె - లవసిపోవ. 59

ముక్కునందుండి నెత్తురు - ముమ్మరముగ
చిందిదిగవాఱి గాయపు — చితుకలందు
కారు రక్తాన మిళితమై - పారునదుల
యుపతిని జూపి ప్రవహించె - నుర్వరమున. 60

మొదట నిలుచుండెఁ దర్వాత — మోకరించె
పిదప చాపుగా నేలపైఁ - జదియుఁ బడియె
కటకటా! నెత్తుటేఁటిలో — కటకిటవడి
ప్రాణములఁ బాసె నంతనా - పావనుండు. 61

ఒకరిదిక్కొకరు గనుచు — నొక్కపలుకు
పలుకుటకునైన నోరాడు — పటిమలేక
పాలిపోయి దిగుల్వడి — జాలబొమ్మ
లో యనంగఁ జూపట్టి రం — దున్న ప్రజలు. 62

పెద్దలనుదిట్టి జీవము - లెద్దనిలిపి
బ్రతుక లేమింక శాస్త్రముల్ — పావకునికి
యర్పితము సేయుటే లెస్స — యనుచుఁ బలికి
కలుషమతులు దలంచిరి — కాంచి యతని. 63

కట్టువలుగట్టి చూచెడు — పట్టణస్థు
లా భయంకర దృశ్యాని — కాగలేక
ఒక్కరొక్కరె వెళ్ళి రా - యిక్కఁ బాసి
ఎవరు గాంచఁగాఁ గలరట్టి - హేయమృతిని. 54

బాధ సైపలేక — పరువెత్తు నిలుకడు,
అతని యిచ్చవచ్చి - నటులశిక్ష
సేయ నేమియనుచుఁ - జిత్తమ్మునందెంచె,
పార్థివుండు మారు — పలుక డిపుడు. 65

మొప్పెయింతధర్మ - మూర్తియగునటంచు
బుద్ధినించుకైనఁ — బుట్టకునికి
తన్నుఁదానెదూరి — తైతక్కలాడెడు
మానసంబుతోడ - మంత్రిఁబిలచి. 66

శవమును గొని తేరఁ బనిచి
యవనీశుఁడు దుఃఖభాగుఁ - డై గృహమునకుఁ
జవమున నేగి భుజింపక
నవయుచుఁ దల్పమ్ముఁ జేరె — నాటిదినమ్మున్. 67

—o—

# అనుతాపము.

## రెండవ మజిలీ.

అది యెఱిఁగి వజీరుఁ డపుడు
ముదమునుఁ జేకూర్పఁబోయి — మ్రోలనునిలువన్
సదమల చరితుం డప్పుడు
హృదయమ్మున నున్నచింత — నిట్లని పలికెన్. 68

ఆచంద్రతారార్క - మై నిల్చు సత్కీర్తి
నేటితో నశియించె - నిశ్చయముగ
అష్టదిశావకా - శ వ్యాప్తమైనట్టి
రాజ్య మన్యాక్రాంత - భ్రాంతిఁ దోఁచె,
సూర్యచంద్రాదులు — శోభనుఁ బోనాడి
ధరఁగూలెననియెడి — కరణిదోఁచె
కంటకమ్ములువేయి - కట్లగా నొకమారు
హృదయమ్ము భేదించు — రీతిదోఁచె

కటికచీకటి సర్వమ్ము - గ్రమ్ముకొనియె
ధర్మనిరతుని జంపిన —తప్పువలన
పాపకర్ముఁడ జీవచ్ఛ - వమ్మునైతి
దుఃఖభారమ్ముఁ బోకార్చు - త్రోవఁ దెలుపు. 69

పుడమిఱేఁడు నగుట - భూస్వాము లెల్లర
నేలుచుంటి ననుట - నెఱిఁగియుంటి,
కాని మమ్ము నేలు - ఘనుఁడొక్కఁ డుండుటఁ
దెలియవలదె మంత్రి - ధీమతులకు. 70

సర్వసంపదలను — సకల సౌఖ్యమ్ములఁ
బొదలుచుండు రాజు - పుష్కలముగ
ననుచుఁ దలఁచు వాడు — నయశాలి కాబోడు
మహితబుద్ధిఁ జూడు — మంత్రివర్య. 71

స్వచ్ఛందమా రత్న — స్థగితహార్మ్యంబు
లెన్నేనిగలవు మా - కేమి ఫలము?
నవరత్నరాజిత - నవ్యభూషణతతి
నెంచగాఁ గాదు మే - లేమిదాన?

ఆరామముల మధ్య - ననురాగమును గూర్చు
సతులు గలరు కాని - సౌఖ్యమేమి?
రుచ్యభోజ్యంబు నో - రూరించునట్టిది
కలదు దానఁ గలుగు - ఫలమదేమి?

భోగభాగ్యమ్ముల నిశమ్ముఁ - బొరయుచుండి,
మనసురంజిలి యొకపని - తనకుఁ దానె
సేయఁజాలని రాజేల - సేవకుండె
ఘనుఁడు స్వాతంత్ర్యజీవియై - మనెడుకతన. 72

సుగుణ నిలయుని యసువులు - చూఱగొనఁగ
కారణమ్మయినాఁడ ద - త్కారణమున
రాజ్యభారమ్ముఁ బోవిడి - గ్రామములకుఁ
బోయి నాజన్మమీరేడు - పొలుపుఁ గాంతు. 73

తండ్రిసముఁడవు, పితరుల - దయనుగొన్న
మహితుఁడవు, విజ్ఞానఘనుఁడ - వ, హితమతుల
మన్నిగొన్నవాఁడవు, మాకు - మార్గదర్శి
వి, దయనీకుండు దీరంగఁ - బ్రీతిఁ బలుకు. 74

నావుఁడు మంత్రివర్యుఁ డొక - నాఁడు భవత్ప్రియ చెడ్డదయ్యెనే
భూవర నేఁటికార్యమునఁ - జుట్టునె చెట్టలు, ధర్మశాస్త్రముల్
కావరమూని పెద్దలను - కానివిధంబున కూఱుపాపులన్
ఈవిధి శిక్షవెట్టుమనె - నెందులకిప్పుడు దుఃఖమందుటల్. 75

రాజువై హరిశ్చంద్ర - రాజ్యలక్ష్మిని బొంది
వనటఁ బొగలఁదగునె — వసుమతీశ,
మీకుఁబూర్వ మవని — మెప్పుగా నేలిన
పాలకుండెవ్వఁడు - పరునికొఱకు,
ఈవిధమ్ముగ దుఃఖ — మేర్పడ వాపోయెఁ
గని విని యుంటివే — కలియుగాన,
జననీజనకులాది — ఘనబంధువర్గముల్
పుత్ర మిత్ర కళత్ర —పుణ్యచరిత,

లెందఱో కలరు, వగపు — నందఁ దగిన
సమయ మెప్పుడో యొదవును, - సర్వజనుల
కొఱకు వాపోవసాధ్యంబె — వరగుణాఢ్య,
గాఢముగఁ జింత సేయుమి —కార్యమందు, 76

ధర్మాధర్మము లారసి
నిర్ణయము సేయఁ దప్ప — నిశ్చలమతితో
కర్మానుబంధమని పతి
దుర్మార్గుల శిక్ష సేయు - దూరపు దృష్టిన్. 77

తనసుతుఁడైనను దండిం
చు ననుపుఁ జూపంగఁ బోడు - సుడివడ డెపుడున్
చెనటితన మ్మెవ్వఁడున్
మనమున సత్యమ్ము నేలు — మహిపతి యెపుడున్. 78

విషమునఁ బ్రాణముల్గొనెదు - వెక్కలి, నింట్లకు
నిప్పుఁ బెట్టి పా
రుషమని వీగు మూర్ఖుని, ప — రోక్షమునందు
పరాంగనారతిన్
విషయసుఖాగ్ని వేల్చు నవి — వేకిని, రాజులు
సర్వ వేళలన్
విషయ వివేచనంబునను - వేగమ శిక్షలు
నెట్టఁగావలెన్. 79

సంశయోచ్ఛేద మొనరించి — సర్వధర్మ
రీతులను జూపునది శాస్త్ర — భూతిగాదె
శాస్త్రసరణి శిక్షించియుఁ — జపలమతిని
సుఖమొందంగ భావ్యమే — దూరమరయు. 80

తనకుఁగల్గు దుఃఖ - తతి విలోకింపంగ
జాలు నరుని నేలఁ - గూలఁదీయు
పరులకొఱకు దుఃఖ .— పరుఁడుగావలెనన్న
సాధ్యమగునటయ్య — జగతిలోన. 81

దేహసౌష్ఠవమిఁకను — తెల్విదొలఁగు
వెండివలె దెల్లనగుచుండు — వెంట్రుకలును
జరయు నావేశమగును - విషాదమొదవు;
నడుమువంగును పదములు - నడువరావు. 82

ఊఁతగావలె చేతికి, — వాతదంత
పటిమదగ్గును, మఱిచావు - ప్రాప్తమగును,
తనదు సమాజదుఃఖమ్మున — మునుగక తన
పరులకొఱకింత వాపోవ — బ్రతుకఁగలమె. 83

నా వుఁడు భూవరుఁ డప్పుడు
భావమునఁ శల్యమట్లు — బాధించు వేళన్
పావనుఁడగు తనమంత్రికిఁ
ద్రోవను జూపింపుమనుచుఁ - తొట్రుచుఁ బలికెన్. 84

సర్వభూతములందు - సమదృష్టిఁ గల్గిన
వాఁడెపో ఘనుఁడని పల్కె - గీత,
జగతిన హింసయే — సర్వశ్రేయమ్మని
వాక్రుచ్చె బుద్ధుండు — వసుధలోన,
నినువలె బొరుగును — ననయంబు ననురాగ
మునఁ జూడమనె క్రీస్తు - మోదమొదవ,
ప్రకృతియె దైవమ్ము — భక్తి సేవింపఁగా
వలెననె శ్రీకృష్ణ — పరమహంస;

కాదుకూడదనఁగఁ - గలమె యీ సూక్తులు
విశదముగను జెప్ప — విశ్వమెల్ల
సమ్మతింపఁగవలె — సద్గుణభూషణ
సమయమునకుఁ దగిన — చందమేల. 85

అనుటయు మంత్రి శితాకున
మనుజాధిపు వాక్యములను — మానముతోడన్
మనమునఁ దలపోసియు దా
చనువున మాటాడెనిట్లు — చపలత వోవన్. 86

భూతదయఁ జూపవలయు భూ — కాంతుఁడనుట
సర్వజన సమ్మతంబగు, — త్వాత్మతలేశుఁ
డటుల వర్తింప న్యాయముగ — హాస్తిమస్త
కమునరజము కీలించు — కరణిఁగాదె. 87

చారచోరులు ప్రబలి ప్ర — జలకు కష్ట
ములకు గుఱిసేతురెప్పుడు — భూతదయను
లగ్నమయియున్న తనచిత్త — లాంఛనంబు
మార్పరుసేయక యుండిన — మనుజనాథ. 88

భూతదయ బొంద నర్హులు — భూతలేశు
వనువు శిరసావహించియు — పనులసేయు,
హితులు, భృత్యులు, మంత్రులు, — పృథ్విపతులు
వీరభట సముదయములు — విప్రవరులు. 89

ఆశ్రమంబుల నాల్గవ - యాశ్రమంబు
లక్ష్యముగఁగొన్న వారలు — డంబుఁదొలఁగి
భూతదయ గల్గి భువిసర్వ — భూతములను
భగవదాంశములని యెంచి - బ్రతుకవలయు. 90

బ్రాహ్మణుల్ వేదపా - రాయణులయ్యును
యజ్ఞపశువధంబు - నాపలేరు;
క్షత్రియుల్ ధర్మంబు - శాసించుచో నుత్త
ములుకూడ హింసకు - బొందుచుంద్రు;
వైశ్యులు వ్యాపార — భాసురు లగుటచే
హింససేయ కిల ర -హింపలేరు;
శూద్రులు సేవచే — శోభిల్లు వారౌట
నడుగడ్గునకు హింస — నడపలేరు;

ఐన తమతమ శక్తికి - ననువుపడిన
కొలఁది హింసమ్ము దా మాను — కొనుటలెన్న
చేయవలసిన పక్షాన - జింతపడి
పంక యమకీట మున్నట్లు — బ్రఁతుకఁబోలు. 91

దుష్ట శిక్షణమును – శిష్ట రక్షణమును
రాజు సల్పవలయు - రాణఁజెలఁగ
దుష్ట శిక్షణమున - దురపిల్లు టొప్పునా
బుద్ధినెంచి చూడు - పుడమిపాల. 92

అని వచియింపగ దుఃఖము
మనమున నెడఁబాసి రాజు - మజ్జనమప్పుడున్
బొనరిచి, భుజించి, విరమిం
చెను; మంత్రి ముదము వహింప – శిష్యులు వోగడన్. 93

భటులు కొందఱు శవమును - భవనమునకు
మోసికొనివచ్చి నృపునికి - మొదట దెల్ప
నతఁడు మంత్రి సామంతులు – ననుసరింప
శవముగల చోటి కరుదెంచె – సానుభూతి. 94

గొనకొని జననాథుఁ డంత
మనమున దుఃఖమ్ము గదుర - మహితుండగునా
ఘనుని శరీరమ్మునుగని
వనముల ప్రోక్షించి మంచి - వస్త్రమునఁ గప్పెన్. 95

గమగమ వాసనలు గొలుపు
సుమ సముదాయమ్ము లధిక - శోభనగతులన్
విమలయశోనిధి యితఁడని
తమలో భావింప జనులు — తా, నవరించెన్. 96

శృంగారమ్ములఁ దీరిచి
భృంగామల తైల నిధుల - బెట్ట శరీరం
బంగీకారముఁ దెల్పిన
నంగాగనుపట్టె నంత — నందలమందున్. 97

మోసికొనిపోయి లక్షలు - పోసి కట్టి
నట్టిగోరినిఁ బెట్టియు - దిట్టపఱచి
ఘనుఁడితఁడని శాసన -మును రచించె
మేళవాద్యము లటమించి — మేళవింప. 98

అవనినాథుఁడు సంతృప్తి - నందిమీఁద
వార్షికోత్సవమును జేయు - పట్టణమున
చాటి కార్యకలాపాల - నల్పఁబోయె,
దివ్యపురుషుని సత్కీర్తి — దిశల బ్రాక. 99

తప్పు త్రోవలఁ బోయెదు - మొప్పెలకును
ధర్మసూత్రమ్ము లాయెడ - తలపులందు
నిలువఁ గార్యముల్ సత్యాన — నిలిచిపోయె
ధర్మనిరతుని కథగ! ని - దర్శనంబు. 100

వరునమప్పుడు కురిసె, ని — వారణమ్ము
గాగ కష్టాలు, రాజ్యాన - గలిగె సిరులు
భోగభాగ్యమ్ము లిసుమంత — పొల్లుపోక
అనుభవింపఁగాఁ దొడఁగిరి - మనుజులెల్ల! 101

—: ఓం తత్సత్ .:—

———o———

# ము క్తి వా ( డు .

ఉదయ మధ్యాహ్న సంధ్యల - నూరుఁ దిరిగి
దేబురించితి కూటికై - తెరపిలేక
పట్టెడన్నంబుఁ బెట్టెడు - పరమపుణ్యు
లెవ్వరును గానరారైరి - ఎవరు దిక్కు. 1

మూఁడు దినములు మొదలుగా - మాఁడుచుండెఁ
బొట్ట, కన్నులు గిఱ్ఱని - సొలుపుఁ దఱిగి
చూడలేకుండె దేనిని - సులభగతిని;
నడువరాకుండె పదములు - పుడమిమీఁద. 2

నోటిలో మాటలు - ధాటిఁ దప్పనినాఁడు
మొఱపెట్టినాడనే - నరునిగన్న
చూపులో నిలకడ - స్రుక్కకుండిననాఁడు
చూచిసాధించితే - శుభగుఁగన్న,

చేతిలో శస్త్రలు - శిథిలమొందనినాఁడు
యాచించినాఁడనే - యధిపుఁగన్న,
కాలిలో బలమింతేఁ - దూలిపోవనినాఁడు
చనినాఁడ నేవాఁడ - సందడన్న;

నేఁడు మాటరాదు; కనులు - నిలిచిచూడ
లేవు; చేతులు కాళ్లు చా - లించెఁ బనులు;
కూలవడినాఁడ నిచ్చోట - కూఁతవెట్టు
వారలెవ్వారు గతిలేని - వానికిపుడు. 3

ఎవఁడు నంబోలి స్వాతంత్ర్య - కృషినొసర్పఁ
జాలె నాదినాల; నిపుడు - చావ సిద్ధ
మైతి; దురదృష్ట మీలాగు - నవడఁజేసె,
దాస్యశృంఖాలఁ బడవేరు - దారికలదె. 4

దేశదాస్యంబుఁ బోకార్ప - దేశభక్తు
లెందఱెందఱో కృషిఁజేయ - నేనుగూడ
సిద్ధసంకల్పహస్తాలఁ - జేరివారి,
చేవకల్గిన పనులనే - చేసినాఁడ. 5

నాఁడు మహోదరమ్మున జ - నమ్ములు నన్ను నుతించి పోరగా
వేడి ధనమ్మునిచ్చిరి; ప్ర - వేశముతోడనె భీషణమ్ముగా
దాడినొనర్చితిం ప్రభువి - ధానము ఖండనఁ జేసి యందుకై
నాఁడు ప్రభుత్వమెంచె నను - నాశము సేయఁగ బంధికానలోన్. 6

కను మొఱంగి భైక్షుకవృత్తిఁ - గొనియు, గూఢ
వర్తనమున పనుల్ సల్పు - వానినన్ను
నొక్క రక్షకభటుఁడు, ము - హూర్తమాత్ర
మున నె గుర్తింపఁ గికురించి - చనితివనికి. 7

వనిలోఁ బోవగ నొక్క చోఁ బడితి సప్పాటిట్లు భిక్షాటనం
బును కై సేయఁగఁ జేసె; కుంటువటులన్ పూర్వంపు ప్రచ్ఛన్న వృ
త్తిని దూరంబుగఁ ద్రోసి స్వేచ్ఛగను వర్తింపంగ నెవ్వారునన్
గనుగోలేక తొలంగిపోయెదరు; సత్కార్యంబె కుంటాటయున్. 8

నాటగోలె నుంఛవృత్తిఁ - గోటపేట
లాదులను దిర్గి జీవిత - మట్టె గడిపి
నాఁడ నేఁడనావృష్టిమై - నవయువారు
పెట్టిపోయఁగాఁ గలరె నేఁ - జెట్టబడఁగ. 9

యుద్ధము నిల్చిపోయె నిఁక - నుత్తమకాలము వచ్చు ధాన్యముల్
పద్ధము లేక చిక్కునను - రూఢిపదంబులు నాశమై భువిన్
సిద్ధముగా వసించెను; ప్ర - సిద్ధిని గాంచిన కాటకంబదో
యుద్ధము కూటికై యిఁక ని - యోజితమయ్యె విచిత్రరీతిగన్.

భోజనశాలల నాకుల
రోజునకొకయింత కూడు - ప్రోలునఁ గ్రోలన్
సాజముగా లభియించెడు
నేజనుఁడా భుక్తశేష - మిప్పుడు వదలున్. 11

పది యవుచ్చుల కూడును - బలముగల్గు
మనుజుఁ డేరీతి తృప్తిగాఁ - దినును? మీఁద
నేమి వదలును? మాబోటి - యెత్తువడిన
ముష్టివారల కడుపులు - తుష్టివడును. 12

వయసుఁ జెల్లిన వాడను - పస్తువడుచు
నెన్ని దినములుఁ బ్రాణాలు - సన్నిహితముఁ
జేసికొందును? నిముసాలుఁ - జెల్లునంతఁ
జెల్లుకొను జీవలవ మింత - చేష్టలుడిగి. 13

ఈసడింపులువడి కూడ — నీసువడక
చేయిఁజాపితి నెదురైన — జీవియెదుట
ఫలితమేమియులేకుండె — భావమెంత
కఠినతమమయ్యె జనులకు - కాలమకట. 14

భారతభూమిలోఁ గలుగు — భాగ్యము లెంచఁగ వీలుకాదు, సం
సారము హాయిగా నడుపు - శక్తులు భారతజాతివే; మహో
దారులు వారలం చనెడు - తత్త్వము నేటికి భిన్నమై, సతం
బారడి నొందుచుండె; కను-లారఁగఁగాంచి కడుంగ డేడ్చితిన్. 15

స్థిరజఠరాగ్నికింధనము - జేసిన దైవము నేఁడు జీవముల్
పరమును జేర్చునంచు తుది - భావము తోఁ త్రోసలాడు చుండగన్
పరిపెను ప్రేమవాహినులు - ప్రాణములేని సరస్సు నాపయిన్
దరుగని మందమారుతవి - తానము వీచుచు హాయిగూర్చుచున్.

చావు కంటిపాపలలోన — చలితమొంద
నేవగింపులు బ్రతుకుపై - నృత్యమాడ
తీక్ష్ణ సూర్యాతపములోన — తెరలుచిన్న
చినుకు లట్టుల హాయిని - జేర్చెకొలను. 17

ఎవరు కట్టిరో దీనిని – యెల్లజనుల
స్నానపానాదులకు నుప – చారి యయ్యెఁ
బ్రాణములు పోవుసమయాన – వర్ధిలుమని
దీవనలనింతు నాతని – దీనవృత్తి. 18

తీర్థయాత్రకు జనములు – తెరపి లేక
వచ్చిపోవుచునున్నారు – వసటఁబడుచు
నున్న ననుఁజూడ రైరి యే – నన్న వీరి
కన్నులకు చీమగానైనఁ – గానుపడనొ. 19

తిరుపతి తీర్థయాత్రలకు – దేశము దేశమునుండి యాత్రికుల్
తెరపి యొకింత లేక చని – తెచ్చినద్రవ్యము ఖర్చుపెట్టి సం
బరముగఁ బోవుచుండిరి కు – మారిలు నాకునొసంగఁగాని నొ
క్కరుఁ దలపంగఁబోరు కట! – గాసిలి చత్తుక్షుధార్తి దీప్తిచేఁ.

ఆత్మార్పణముఁ జేసి – యాశ్రయించనినాఁడు
కననౌనె దైవమ్ము – గనులతోడ;
సర్వభూతములందు – సమదృష్టి నిలుపమి
భావింపఁగానౌనె – పరము నెడఁద,

నిత్యకృత్యములందు — నిర్వృత్తి నెంచమి
దరిఁజేరఁగానౌనె — దైవపరిధి;
తన్నుఁదా నెఱిఁగెడు — తత్వంబుఁ దెలియమి
లోఁగానరానె యా — లోకనాథు;

సృష్టి సర్వముఁ దానుగా — నెంచి జీవ
కోటి నెల్లను ప్రేమతోఁ — గొలువకున్న
సర్వమయుఁడైన భగవంతు — సరసఁజేర
వలనుపడదని చాటింతు — పతనవేళ. 21

బాహ్యాడంబరమైన వేషమున నేభక్తుండనం చెంపుచున్
వాహ్యాళుల్ జనుమానవుండు గనునే స్వర్గంబు! జగమ్ములో
బాహ్యావర్తమునందునుండి కనుపో పాపాత్మకంబైన యా
గుహ్యప్లాపము లన్నియుం; దలపులం గోవిందుఁ బ్రార్థింపమిన్.

సంగీత సరళిలో — సందీప్తమైనట్టి
లయవోలె సృష్టి వె — లయును ప్రేమ
సాహిత్యధోరణిం — జాలువారెడులయ
రీతి భూతాల నా — వృతము ప్రేమ

శిల్పకళాసృష్టి — జెలఁగు సాధనలయ
వెలె జీవరాసుల — వరలు ప్రేమ,
నృత్యసాహితిలోన — వృద్ధిఁగాంచెడులయ
ఖ్యాతిప్రపంచానఁ — బరగు ప్రేమ,

ప్రేమపరిణితి పాటించి — ప్రేమలోన
లీనమైపోవ లేనట్టి — హీనజనుఁడు
ప్రేమమూర్తిని గాంచఁగాఁ — గృషియొనర్చి
ఫలితముండునె? శ్రమలు సం — భవముగాక. 25

పూవుఁ గనుఁగొని యందలి — తావునెఱిఁగి
సంతసించుట కాదది — యొంతలేసి
కార్యకారణంబో తెలియఁ — గడలుకొనును
జ్ఞానవీచిక హృదయాన — మానవులకు. 26

జన్మమెత్తుట లౌకిక — సంపదలను
జుట్టుకొనుటకే నన్నది — స్థూలదృష్టి,
సర్వభూతదయాపర — స్వాంతమొలయఁ
జూచి సృష్టి సేవించుటే — సూక్ష్మదృష్టి. 27

కనజగదంతర లీనుని
జనుజగముల లీనమొంది – సాధింపంగాన్
గనుగొన నన్యాపథమ్ముల
వినుపేథ నెగురదలంచు - విధమగుఁ దలపన్. 26

నీపదరేణువు నేనని
తాపసమందారు నెంచి – దైన్యప్రవృత్తిన్
దాపకహృదయము నిచ్చియు
లోపములను బాయ నతఁడు – లోపసియించున్. 27

తలబోడిఁ జేసికొని నే
కులదైవము నెంచినాడ - కోరిక నెగ్గన్
కలదే? లోపంబనుచుం
దలఁచునతండెడ్డె జనుఁడు – ధారుణిలోనన్ 28

తలలో వెంట్రుకలిచ్చుట
తలపున గర్వంబువీడు – తార్కాణంబై
కులదైవము నెదఁదాల్పఁగ
వెలయు విధానంబుగాదె – వివరణసేయన్. 29

ఆత్మవత్సర్వభూతాని - యనెడు సూక్తి
హృదయక్షేత్రాన నిలిపియు - వృద్ధిఁ జేయ
కున్న దైవమ్ముఁ గనుటెట్లు? - గుండుఁ జేసి
కొన్న భక్తులౌదురె మాన్య - గుణము దొఱఁగి. 30

గుళ్లు గోపురాలన్నియు - గుఱికుదింప
నేర్పరుపబడ్డవే కాని - యీశ్వరుండు
గుళ్లకన్న మిగుల నిన్ను - గూడు నిజము
బాహ్యపూజలచేతను - భంగపడుదె. 31

భాస్వరమ్మగు సూర్యాత - పమ్మునందు
భగ్నహృదయమ్ముఁ గాంచిన - భక్తుఁడెట్లు
శశిమనోహరద్యుతులను - సంతరించు
నిబ్బరము పెన్నిధానంబు - నిశ్చయముగ. 32

ఆకటిమంటచే నటుల - నాడితి తోచిన రీతులెల్లనో
ప్రాకటకీర్తివైభవ, ని - వారణసేయుము దోసముల్ ననుం
నీ కళలో ధరించుకొని - నిశ్చలపీఠమునిమ్ము ప్రాణముల్
నీకరదోయినుంచెదను; - నిశ్చయమీ నిముసంబులోపలన్. 33

నీస్వరూపమ్ముఁ దెలియక — నిజముఁ గనక
పెరటిమార్గాన బడినారు — ప్రియకొమాళ్లు
దారిఁ జూపెడు కర్తవు — యూరకొన్న
నెవరు రక్షింప వచ్చెద — రింకస్వామి. ౩౪

ప్రాణములచేత నివ్వాళిఁ — బట్టినాడ
కనుమొగుడ్చు లోపుగనను — గలిపికొనుము
సంతతాహ్లాదసాగర — స్వామృతాన
కలహ లేడంచు నెలసెదు — కన్నతండ్రి. ౩౫

బోర్లఁబడి ప్రాణములుబాసి — పొలుపుమాసి
సరసుగట్టున బోయెడు — జనుల దృష్టి
నింతనాకర్షణముఁ జేసె — కొంతమంది
మోసికొనిపోయి భూమిలో — పూడ్చిరతని. ౩౬

స మా ప్త ము .

# సవరణ.

| పేజి నెం. | పద్యము నెం. | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 1 | 1 | భోగముతోడ | భోగములతోడ |
| 12 | 39 | గ్రస్తుఁడై | సక్తుఁడై |
| 18 | 60 | యుదతిని | యుద్ధతిని |
| 22 | 72 | హార్మ్యంబు | హార్మ్యంబుల |
| ,, | ,, | అన్నేని | వెన్నేని |

——o——